కం॥ మునివల్లభుపలుకులు విని, జననాథుం డైనయానిజాముద్దౌలా
మనములర మెచ్చి నీకో, రినగ్రామం బెచటనొ వివరింపు మనంగన్॥ ౧౮౧

తే॥ ఆగుచు సర్కారుముస్తఫానగరు విన్న, కోటపరగణాలో మజుకూరు సన్న
పాడు వ్యాఘ్రాళి జగత్ప్రతీతి నునికి, గ్రామమిది మీరుజాఘీరుగా నొసంగ
వలె జగన్నాథునకు నుత్సవములకొరకు॥ ౧౮౨

స్రగ్ధర

ఆలక్ దెల్పంగా నయ్యతిపతివచనం బర్థితో డక్ నిజాము
ద్దౌలా యాలించి హంకే దవులతు ఖుబుహో తా జగన్నాధకే మా
లా కే ఖుష్‌పరమో మనుచు నెదుట నమ్రానమం డౌదివాన్జీ
నాలోకించెన్ లిఖో షేయబిసనదనితా నాన తిచ్చెన్ బిరానన్॥ ౧౮౩

నిజాముద్దౌలా స్వామివారికి జాఘీరిచ్చుట

తే॥ అప్పుడు దివాను స్వయముగా హస్తమునను, కలము కాగితమును గొని యె
లమి మీరఁ
బాదుషా యాజ్ఞఁ బాటించి వ్రాసెనుఫర, మాన వ్రాసినఫక్కి క్రమముగఁ జదివె॥

నిజాముద్దౌలాసనదు.

వ॥ బ ఆమిలాను హాలు వ యిస్తకబోలు పరగణేవిన్నకోట సర్కార్ ముస్తఫాన్నగర్ నూబేహాయిదరాబాదు నిలిస్తమీవదు మాంజె వడాలి సన్నపాడుఅమికే పరగణే మజుకూరు కామిలు ౧౫౦ జగన్నాథు ఆ రాజాతు లకిందను ఖదమ్ నుంచి మొకర్రరు జారీ గనుక దరింవిలాను బదస్తు మామూలు హాసబ్ బమను బనాము మామిలై బహాలు ముసల్లం చేయ నైనది. కాయదు కే ముంజే మజుకూర్ మహర్నకే తసరఫున విడిచిపెట్టేది. అందువల్ల వచ్చిన మహాన్యాలు అనుభవిస్తూ బదా ఆయే తరక్కి కింమరం యెక్ శాలు ఆబాదు యింతీసాలు హామషుగ ... ల వుండేది ...ఆబాబు తాఖీదు గాన తెలిసేది.

చం ౧ షహార్ జమాదిలవల్ సన్ ౧౧౭౮ హిజారా

బమను బమోజబు సవాల్ దస్కతన్॥ ౧౮౪

కం॥ అని చదువఁ బాదుషామన, మునను జగన్నాథుఁదలఁచి మ్రొక్కి స్వయముగా
సనదుపయి మొహారు వైచి స, వినయముగా నిచ్చె మానివిభునకు నంతన్॥

# జగన్నాథీయము

॥ సనదు తన చేతఁ గొనుచు నచ్చటను వెడలి, తనమనోవేగమున వచ్చి తత్క్షణంబ
కృష్ణవేణి జలముల మున్గినప్రదేశ, మునను వెస లేచి తత్తటమునకు వచ్చి॥ ౧౬౮

అవధూతస్వామి కృష్ణలోనుంచి లేచి సనదు బ్రాహ్మణులకు చూపుట.

॥ భూదేవతలఁ జూచి పాదుషాపరమాన దెచ్చితి మన దేవదేవునకును
సన్నపాడు వడాలి జాఘీరుగా నిజా, మద్దవులా బహుమతి యొసంగె
నిదిగొ సన్నదు మన మేగుద మిఁక రండు, లెండన వార లా ల కద్భు
తము నొంది యొకముహూర్తమునిండగాలేదు హైదరాబా దెక్కడానిజాము
గీ॥ పాదుషాలొలు వెక్క డెప్పగిది నేగి, తెచ్చితిరి పరమాన మాకిచ్చెరు వగు
మీమహాత్వంబువర్ణింప మేరఁగలదె, యనుచునవధూతఁబొగడిరయ్యవనిసురులు॥

ఉత్సాహ.

యోగమహిమ మద్భుతం బహో మహానుభావ నీ
యీగురు ప్రభావమార యెన్న నెంతవార మో
యోగివర్య శిష్యులన్ సముద్ధరింపఁ గా మహా
భాగ ధాత్రి నవతరించు వ్యాసమౌని వీవయా॥ ౧౬౯

వ॥ అనుచు బ్రాహ్మణసమూహము ప్రశంసింప నయ్యతిచందు ండు మగుడి
వచ్చి. ౧౭౦

అవధూత వడాలిలో చేసినయేర్పాటు.

॥ ఆజగన్నాథ దేవాలయంబునఁ బ్రీతి, దినమును స్వస్తి వాచన మొనర్ప
సంగీతమును బాడి సతతము హరిభజ, నము నొనర్పఁగ బ్రాహ్మణప్రవరుల
నియమించి వారికి నిత జీవనము గా, నౌకరీలొరకు నీనాములుగను
సగబాలుగా ప్రమ మొసంగి తక్కి నసగం బాజగన్నాథు నిత్యార్చనమును
॥ బక్షమాసవర్ధ బ్రహ్మోత్సవాదులు, జరుపుటకును నియతి సల్పియట్లు
జరుగునట్లు నిలిపెఁ బురుషోత్తమానంద, యతివరేణ్యుఁ డీశ్వరార్పణముగ॥

ఆ॥వె॥ వారణాశినుండి వచ్చినకతమున, భూరిసుగుణధనులు వారణాశి
వా రనంగ విప్రవరులు స్వామికి న, సలుపఁజొచ్చి రచట శాశ్వతముగ॥

శా॥ ఆచంద్రార్కము గాఁగ నుల్లసిలు స్వాస్థ్యం బిట్టు లార్జించి స
ద్శ్రీ సుస్థితి సంతతోత్సవము లర్థిఁ సంప్రవర్తించు న
ట్లాచందంబున నేరుపాటులను సమ్యగ్భంగిఁ గావించి నా
ర్యాచీనప్రమదంబు నొందెను గృతార్థంమన్యమానాత్ముఁడై॥ ౧౯౩

శా॥ బోధానందధురీణుఁ డయ్యతి ముదాపూర్ణాత్ముఁడై జగ
న్నాథస్వామికి భక్తు లెల్లఁ బ్రమదోన్మగ్నాత్ములై చూడ ని
ర్బాధప్రక్రియ బ్రాహ్మణప్రతతితో బ్రహ్మోత్సవం బప్పుడా
వ్యాధాళిఁ రచియించె భూజనులు ధన్యంమన్య లైకొల్వఁగన్॥ ౧౯౪

జగన్నాథస్వామివారి బ్రహ్మోత్సవము.

కం॥ ఆషాఢశు పూర్ణిమ, భాషాపతితుల్యుఁడైన బ్రహ్మర్షి సము
న్మేషితవిభవోత్సవపరి, పోషముగ రథోత్సవము విభున కొనరించెన్॥ ౧౯౫

సీ॥ బహువిధాలంకారభాసురం బైమించు, పుష్యరథంబున భూరికనక
భూషణాలంకృతవేషంబు లలరను, భద్రాజగన్నాథబలవిభులను
వేంచేపు సేయించి చోపులను వీవ, సూర్యచంద్రప్రభల్ సొంపు గులుక
వ్రాతాతపత్రంబు చెలువుసూపఁగఁ బవల్, దివిజులు వెలుఁగ స్వస్తిరవ మొప్ప॥

గీ॥ భూరిభేరీధణంధణాత్కారనినద, మాకసము నిండఁ దూర్యత్రయములు మ్రోయ
సరసహరిభక్తు లెల్ల భజన లొనర్ప, నపుడు రథయాత్ర గావించె రభినవముగ

తే॥ ఆజగన్నాథునిరథోత్స వావసరము, నందు జనములసందడే మందుముందు
సేసలుగ పల్లుకుసుమముల్ చిత్రమవని, నొక్కచేనియుఁ బడదయ్యె నక్క
జముగ॥ ౧౯౬

॥ పలుతుల నంగడులను, ఫలములు భక్ష్యములు గొనుచుఁ బ్రజలెల్ల మురా
కలితు లయి మెలఁగి రే మని, తెలుపుదు నయ్యుత్సవంబు తెరఁగుల్ మెరుఁ
గుల్॥ ౧౯౭

మ॥ అలరంభోర్వశిమేనకాదులను గాదంచున్ దటాయించున
ట్టి లసత్ప్రియాంద్రవిలాసనృత ముల విల్ చెప్పఁగా శక్యమే
విలసన్నీలవలాహకాంచనలట ద్విద్యుల్లతావిభ్రమం
బుల నెల్ల దలపించెఁ బ్రేక్షకజనంబుల్ మేలు సేబాసనన్॥ ౧౯౮

## జగన్నాథీయము

చ॥ అలరుమొలంగురంగుగిలు • బాడెడుకోమలహస్త పల్లవం
బులు భరతాంచితాభినయ•ముల్ చవి చూపఁగ నవ్విపంచికా
కలరవ మేళనంబుగను • గాత్రరవం బమృతప్రవాహముల్
బలుమరు సెల్లెడల్ బరపఁ • బణ్యసతీమణు లాడి రయ్యెడన్॥ ౨౦౨
చ॥ లలితవిలాసవిభ్రమము•లన్ నెలకొల్పుచు నబ్బురంపుఁగో
పులభరతాగమాభినయ•ముల్ రచియింపుచు నాట్యమాడు కో
వెలఁదులఁ జూడఁ బాల్కడలి • విస్ఫుటతుంగతరంగభంగికల్
వెలువడి వచ్చునచ్చరల • విన్నను విట్టి ద టంచుఁ దెల్పెడున్॥ ౨౦౩
ఆ॥వె॥ అట్లు సకలమాన•వామోదదాయిగా, హరిరథోత్సవంబు • నతులవిభవ
మలర జరిపి యవల • • సవధూత విప్రసం, తర్పణం బొనర్చె • నేర్పుమీర॥
సీ॥ చార గీరయు లేని•సన్నబియ్యంపు మే, లోగిరంబును మంచి•యొలువుపప్పు
నప్పడంబులు పది•యాంబులు బహువిధ,శాకపాకములు ప•చ్చళ్ళుఁ బిండి
వంటలుఁ బలుకల•వంటకంబులు చిటి, గారెలు బూరెలు • చారు లూరు
గాయలు హో లు • కమ్మని నేతులు, పరమాన్నములు బహు•భక్ష్యములును
॥ నొదవు పులియోగి రమ్ము ద • ధ్యోదనమ్ము, చక్రపొంగలి పలుచని • తక్రములును
గొల్లలుగఁ దెచ్చి వడ్డింప• నుల్లసిల్లి, భూసురవ్రాత మెల్ల బో• నేసె నపుడు॥
వ॥ అట్లుత్సవాంతంబున భూరిసంతర్పణం బాచరించి చక్రితీర్థంబు గావించి విధ్యుక్త విధానంబున బ్రహ్మోత్సవంబు నిర్వర్తించి యప్పరమహంస పరివ్రాజకాచార్యుం డగు శ్రీపురుషోత్తమానందావధూత శ్రీజగన్నాథ ప్రతిష్ఠోత్సవాదు లొనరించి పూర్వ భవాభివాంఛితార్థ సాఫల్యంబుఁ గాంచి కృతార్థంమన్యమానుండై యుండె నంతరంబున. ౨౦౪

ఏడాలి అగ్రహారనిర్మాణము.

తే॥ సన్నపాటికి దక్షిణా • శను సమిద్ధ, బోధివృక్షంబుకడ జగ • న్నాథు నాల
యంబునకు నుత్తరమున బ్రా•హ్మణులకగ్ర, హారనిర్మాణ మొనరించె•యతివరుండు॥
• ॥ తనదు ర్తి ధ్వజంబు చం• దమునస్వామి, కంచితధ్వజ మెత్తించి • మించుమంట
పమ్ముప్రాకారమునురుచి•రమ్ములుగనో, నర్చెఁ గావించెబహు వాహ•నములుహరికి॥
శా॥ దేవబ్రాహ్మణసంప్రతిష్ఠలను భ • క్తింజేసి శ్రీవిష్ణుసం
సేవాసిద్ధికి నుల్లసిల్లి జని ని • శ్శేషంబుగా ధన్యతా

శ్రీవెల్గొందఁ గృతార్థచిత్తుఁ డగుచున్ ♦ సిద్ధాగ్రగణ్యుం డనన్
ప్రావిర్భూత యశోవిశేష మమరన్ ♦ భాసిల్లె యోగీంద్రుఁడున్ ॥ ౨౦

తే॥ అపుడు వ్యాఘ్రాళికినివాస ♦ మగుటకతన, సార్థకంబుగ వ్యాఘ్రాళి♦ యనెడుపేరొ
సంగెఁ బురికదివాడుక♦ జరిగిజరిగి, యిప్పుడు "వడాలి" యనుపేరనొప్పుచుండె

తే॥ ఆరువేలనియోగి బ్రా ♦ హ్మణకుల ప్ర, భూతపురుషోత్తమాఖ్యావ♦ ధూత యాది
వాకరేందు ననశ్వర ♦ భవ్య కీర్తి కేతు వగుచు వడాలి వి♦ ఖ్యాతిఁ గాంచె॥

వ॥ అనిచెప్పి తత్ప్రభావం బిట్లని వక్కాణించె. ౨౧

వడాలి క్షేత్ర ప్రభావము.

మ॥ నరుఁ డెవ్వాఁడు వడాలివాసుని జగ ♦ న్నాథున్ మహాభక్తిత
త్పరభావంబునఁ బర్వకాలమున సందర్శించి తత్పాపసం
కరుహాఘ్యానధురీణుఁ డైన హరి స ♦ త్కారుణ్య సంయుక్తి బం
ధుర దోషాంధతమః ప్రకాండములు ని ♦ ర్ధూతంబు లౌఁ గ్రక్కునన్ ॥ ౨౧

కం॥ ఆషాఢశుద్ధపూర్ణిమ, శేషశయానుఁ డగుహరి భ ♦ జించిన నరు ని
శ్శేషాంహః పంకము పరి, శోషితమైపోవు సకల ♦ శుభములు కలుగున్ ॥ ౨౧

తే॥ నరుఁడు దృఢభక్తితో జగ ♦ న్నాథునవ్వ, డాలిపురవాసు సేవించి ♦ నీలశై
నాథుఁ డైనట్టి శ్రీజగ ♦ న్నాథుసేవఁ, జేసిన ఫలంబుఁదాఁగాంచు♦సిద్ధమిదియు

కం॥ మధుమాధవమాసంబుల, మధుసూదనపాదయుగ స ♦ మర్చన రతుఁ డై
ప్రథితమగు భక్తిఁగొలిచిన, విధుతభవుఁ డగుచు మోక్ష ♦ విభవముఁ గాంచున్

కం॥ శ్రావణభాద్రపదంబుల, శ్రీవిభుపాదాంబుజములు ♦ సేవించిన నం
హోలిసర మడగి మోక్ష, శ్రీవిభవముఁగాంచు నరుఁడు ♦ సిద్ధముసుమ్మీ ॥ ౨౧

కం॥ శరదవసరమున శ్రీహరి, చరణములు ప్రసూనతతుల ♦ సమధికభక్తిన్
భరితుఁ డయి పూజ చేసినఁ, బరమశ్రేయః ఫలంబు ♦ పాపించు నరున్ ॥

కం॥ హేమంతావసరంబులఁ, జామంతివిరుల్మకుంద♦చరణాబ్జములన్
ప్రేమెరయఁ బూజ చేసిన, నామానవుఁ డిహపరముల ♦ నతిశుభముఁ గనున్

॥ మాఘశుద్ధద్వాదశి ♦ మధువిరోధి, యగుజగన్నాథు నర్చించి♦నట్టిజనుఁడు
అశ్వమేధశతాధికం ♦ బగుఫలంబుఁ, గాంచు హరిలోకముఁ♦గాంచుఁదుదను

# జగన్నాథీయము

క॥ రవికన్యాగతుఁడై తగు, నవసరమున శ్రీవటాలి • యందు సుభద్రా
ధవు నెదుట హిరణ్యశ్రా, ద్ధవిధి నడుపఁ బితల కధిక • తరఫలదమగున్ ॥

మ॥ రవికన్యాగతుఁడైనచో భరణితారన్ శ్రీజగన్నాథు భ
క్తి విశేషంబునఁ బూజ చేసి పితృసూక్తిన్ గోరి వ్యాధాళి •
ర్థవిధిన్ శ్రాద్ధ మొనర్చె నేని యవి ముక్తిక్షేత్రమందున్ గయన్
సవిశేషార్పితపిండదానఫల మా • సత్యంబు వాక్రుచ్చెదన్ ॥ ౨౨౦

క॥ తపనుఁడు ధనురుపగతుఁ డౌ, నపుడు జగన్నాథుఁ బ్రాత • రవసరముల న
చ్చపుభక్తిఁ గొలిచె నేనియు, వ్యపగతభవబంధుఁడయి శి • వము నరుఁడు గనున్ ॥

తే॥ బోధనైకాదశిని మహా • బోధివృక్ష, మున జగన్నాథు నర్చించి • భూరినిష్ఠ
జాగరం బొనరించిన • జనుఁడు దళిత, సకలభవబంధుఁడగుచు మోక్షంబుఁ గాంచు ॥

క॥ రాథైకాదశిని జగ, న్నాథునికిన్ బానకంబు • నైవేద్య మిడన్
సా తసకలేష్టార్థుం, డై ధన్యతఁ గాంచు జనుఁడు • దంచితనియతిన్ ॥ ౨౨౩

క॥ ప్రోష్ఠపదైకాదశి నతి, నిష్ఠాయుతుఁడై ముకుందు • ని పదాబ్జములన్
దుష్టిఁగఁ దుల-పూజ యను, ష్ఠించినజనుఁడు దాఁ గ • నున్ మోక్షరమన్ ॥

క॥ మార్గశిరమాసమునను న, ర్గళ మగుభక్తి శ్రీజ • నార్దనునకుఁ బ్రా
తర్గంధార్చన సలిపి త్రి, వర్గఫలంబులను గాంచు • వాఁడు నరుఁ డొగిన్ ॥ ౨౨౫

క॥ వ్యాధాళి కేని యధికవి, బోధం బొనరించి మోక్ష •ము నొసంగినయా
బోధిద్రుమంబుఁ గనుఁగొని, సాధితపరమార్థుఁ డగు ని • జము జనుఁ డవనిన్ ॥

క॥ ఆసన్నపాటికిని గడు, నాసన్నం బగువటాలి • యందు హరి నరుం
డాసన్నతుఁడై కొలిచి ర, మాసన్నద్ధప్రబోధ • మహిమం గాంచున్ ॥ ౨౨౭

క॥ ఎవఁ డాలి బిడ్డలను విడి, చి వటాలి వసించి యందు • శ్రీహరి సేవిం
చి వటాలిరహితుఁడై ని, ల్చి వధూలింగననియుక్తి • చే ముక్తిఁ గనున్ ॥

క॥ అని యిట్లు సూతుఁ డమ్ముని, జనులకు వ్యాధాళియందు • జక్రధరుఁడు పె
పొనర జగన్నాథాకృతిఁ, బునరధిగతుఁ డగుట తెల్ల • ముగ వినిపించెన్ ॥

ఆశ్వాసాంతము.

శా॥ ఉష్ణాంశ్వన్వయదుగ్ధవారితుహినాం • శూరీకృతాకార గం
గోష్ణీషప్రచలద్ధనుర్ధ్వజనబా • హాహూత్యేక లోకత`యా

నిష్ఠాలోజ్జ్వలకీర్తి వర్తితహిమా♦నీరుక్కళామండలా
తృష్ణాదోషవిదూర సద్ధృదయా♦ శ్రీ రామచంద్రప్రభూ॥ ౧౩౦

కం॥ పాల్కడలి పుట్టురతనము, గుల్కెడు నెదఁ బొదలు కల్మి♦భామతోడ జగా
శేల్కొనుచుఁ గనికరము గదుఁ, జిల్కుచు లెంకలను బ్రోచు♦ చేరువకాఁడా॥

పుష్పితాగ్రవృత్తము.

పరమపురుష ♦ భానువంశచంద్రా, ధరణిసుతాధిప ♦ దారితాసురేంద్రా
నిరుపమగుణ ♦ నిత్య ర్తిసాంద్రా, ప్రరుచిరసూర్యపు ♦ రస్థరామచంద్రా॥

గద్య.

ఇది శ్రీమద్వృషాకపికృపాకటాక్ష పరివర్ధితసహజ సారస్వతసమ్పాది
తప్రబంధ కవిపంచానన బిరుదాభిరామ విశ్వామిత్ర బ్రహ్మర్షి
సంప్రదాయాడవి నందగిరి వంశాబ్ధిసోమ సహజసౌహా
దమహోద్యమ సాంబశివ వేంకటప్ప రాయ
కవిలలామ వినిర్మితంబగు శివవేంకటీయ
గ్రంథమాల యందుఁ దృతీయ
పుష్ప మగు జగన్నా
థీయమహాప్రబం
ధమునఁ దృతీ
యాశ్వా
సము.

# జగన్నాథీయము.

## చతుర్థాశ్వాసము.

మత్సమస్తసుగుణ, స్తోమాపాదాబ్జవినత•సుత్రామసము
ద్దామరిపు మదనుజవి, రామా సూర్యపురిధామ•రాజలలామా॥

వ॥ అవధరింపు మట్లు సూతుండు శౌనకాదులకు వ్యాధాక్షేత్ర నిర్మాణ ప్రకారం బెరింగించినంతట నవ్విశేషం బంతయు నాలకించి ప్రహృష్టతరంగితాంతరంగులై వారలు సూతున కిట్లనిరి. ౨

కం॥ సూత భవద్వదనాంబుజ, గీతంబగువిష్ణుకథ ప్ర•కృష్టప్రమదో
పేతమతిఁ వింటిమి దుఠి, తాతంకములడఁగె సఫల • మయ్యెఁ జనియుఁ॥ 3

జగన్నాథునకు సుభద్ర భార్య యెట్లయ్యెనని యడుగుట.

తే॥ ఆజగన్నాయకుండు కృ•ష్ణావతార, మనియు నవ్విగ్రహత్రిత•యంబు కృష్ణ
బలసుభద్ర లటంచును • బల్కి తీవు, తచ్చరిత్రంబు కడు నద్భు•తంబు వినఁగ॥

సీ॥ సాధుసన్నుతజగ•న్నాథునకును వాసు, భద్ర భార్య యటంచుఁ•బలుకు చుంద్రు
తగఁ గృష్ణుఁడునుసుభ•ద్రయునన్నయును జెలి, యలుగాఁ బ్రసిద్ధ మా•నందునిప్పు
డాకృష్ణునంశయే • యగుజగన్నాథున, కాసుభద్ర య దెట్టు • లయె భార
సంశయం బెంతయు • జనియించె నీవిష, యంబు విస్పష్ట మా•నట్లు దెలిపి

గీ॥ మము కృతార్థులఁ జేయుము • మౌనివర్య, వాసుదేవకథాసుధా • వర్ష మతుల
హర్షసంధాయకము తృప్తి•యగునె యెంత, వినిన నిది దెల్పవే మాకు•వివరముగను॥

నం అని శౌనకాదులడిగిన, విని సూతుఁడు బహుపురాణ•విజ్ఞానమహా
త్వనితాంతఖ్యాతుండై, ట్లని సెప్పె లియన్నదీ క•లారవపణితిఁ॥ ౬

చ॥ ఘనమతులార మీకు మదిఁ • గల్గినసందియ మెల్లఁ దీఱగా
వినిచెదఁ బూర్వకాలికము•వృత్తము చాలఁగ గోప మై తన
ర్చినయది సుండు దీన నల•శ్రీహరి కైనను గర్మబంధభో
గనియతి తప్ప దంచెఱుఁగఁ • గాఁ దగుఁ గాన నవశ వేద మా॥ ౭

చ॥ మును యదువంశమున్ బరమ•పా ము సేయఁ దలంచి యాజనా
ర్దనుఁ డఖిలేశ్వరుండు మధు•రాపురిలో వసుదేవ దేవ
తనయుఁడు గా జనించి వసు•ధాతలరక్షణ మాచరించుచో
ఘనుఁడు మురారికిన్ సహజ•గా జనియించె సుభద్రయయ్యెడన్॥ ౮

క॥ ఆ వకిగర్భసుధా, పాథోనిధిచంద్రకళ సు•భద్ర నవవయః
ప్రాదుర్భవమున నయనా, హ్లాదకరాకారకలిత•యై విలసిల్లెన్॥ ౯

తే॥ సకియకును బాల్యమంతంత•జారుపాంటెఁ, గొనునింతింతసన్నము•గాఁగఁ జొచ్చె
బడఁతికఁ దటయౌవనో•ల్బణముగాఁగఁ, బొటకరించుచు గుబ్బలు•బ్బిరముసూపె

॥ తలఁపు లూరనిచిన్న•తనపుఁజూపులు మాని, సోలపుబిత్తరిచూపు • నూడ నే
మురిపెంపుటల్లారు•ముద్దుమాటలు మాని, బలుమిటారపుఁబల్కు • పలుక నేరె
మురువుఁ జూపెడునద్దు•ముద్దుచందము మాని, దినసైనకులుకుటొ•ద్దికలు నేర్చె
వలపు మెరుంగనిభంగి • యగుచు నుండుటమాని, తవితీపు సెరజాణ•తనము నేగ

॥ ఆటకోరుతనం బల•వాటుమాని, గరువతన ముప్పతిల మెలఁ•గంగ నేర్చె
నంబుజదళాయతాక్షి బా•ల్యంబు సడలి, మించు లేజవ్వనం బంకు•రించు వేళ॥ ౧

తే॥ గనుఁగొనఁగఁ జంద మామకుఁ•గళలు పదియు, నారటందురు దానిచి•న్నారి మో
కళలచెలువంపుసోగ సెన్నఁ • గాఁ దరంబె, యింతిమోమున ందున•కేమి రము

కం॥ తెలిదమ్మిరేకుమీఁదను, దోలఁగక యెలదేఁటి నిలిచి • తోఁచినయేనిన్
దులఁయుగుఁ గన్నులకన్నన్, గులుకుం జూపుసోల పెచటఁ • గొని తేవచ్చున్

తే॥ పాలఁ నాసిక యై యెల్ల•పూలఁ గలుగు, పరిమళానుభవస్ఫూర్తిఁ • బడసి చా
గంధఫలి సర్వసుమనఃప్ర•కాండసార, భములు వలచుచు నేటికిఁ• బ్రౌఢి గను

తే॥ అబలకెమ్మోవి ప్రతిబింబ • మస్సుధాత, బింబము సృజించెఁగా కేమి•విపులమ
మునొడంగూర్ప నేర్చునే•మరియునందు, చేత నేబింబమను పే ఁ•జెందెన యి

॥ వనితయౌవనశృంగార • వనమునందు, గలుగునడబావి యనఁగఁ బొ•
నచటికృతకాచలద్వ •యంబు కరఁ , బటువుచనుగవ్వరోయి ని• రమున

తే॥ జఘనమండలి సైకత•స్థలిని బోదలు, నవఁటిబోఁదెలు పెందొడ • లత
కాహళులు జంఘికలు బాల•కమఠపృష్ఠ, సమము మంచితములు ప •పదములు చె

కం॥ పల్లవములు తత్పదసం, పల్లవవిజితృష్ణమాధ • వసముద్దేశ
ప్రోల్లసనమునఁ దపస్స్థితి, మొల్లం బై చెడి విరాగ • మునఁగస టొందెన్.

॥ కన్నెత్తి చూచెనా • కడు భయభ్రాంతయై, హరిణిదిక్కులు సూచి • యుటమటించు
నిలిచి మాటాడెనా • కలఁగి గద్గదికతో, మదిఁ దారుమారగు • మంజుఘోష
మైత్రిగ మెరసెనా • మలఁగి వివర్ణయై, కంది గ్రక్కునఁ గాకఁ • జెందు హేమ
నగుమొగం బెత్తెనా • నొగిలి కాంతి దొరంగి, శశిరేఖ వక్రయై • సన్నగిల్లు

॥ పెందొడలయందమొకకొంత • బెడఁగు సూప, వాడియారంభమొకపార • విడిగ్రుక్కు
నచ్చెరలు గిచ్చరలు దాని • హాసుగనిన, నిలువుకన్నులఁగనుగొన • వలదె యెపుడు॥

సుభద్రను కృష్ణుడు వరునిఁగోరుమనుట.

కం॥ ఈరీతి నవోజ్జృంభిత, తారుణ్యవిలోకనీయ • తాసముపగతా
కార యగుచు నవ్వికచాం, భోరుహదళనేత్రి మిగులఁ • బొలుపొందు నెడన్॥

మ॥ ఒకనాఁ డాసురదైత్యభేది ప్రియ మిం • పొందంగఁ దా నిష్టగో
ష్ఠికలాపంబున నుండి యచ్చెలియలిన్ • జేసన్న రావించి మ
చ్చిక మీరంగను గారవించి రుచిర • స్మేరాననుం డై వినో
దకథాసంగతిఁ బ్రొద్దు పుచ్చుచుఁ బ్ర మో • దం బొప్పఁగా ని ట్లనున్॥ ౨౧

తే॥ ఇంతికో నీకునిటఁ బెండ్లి • యీడు వచ్చెఁ, దడవుసేయంగ రాదింకఁ • దలిరుఁబోఁడి
మనసు కెక్కినరాజకు • మారు నొకని, గోరుకొను మమ్మ నీ కొడఁ • గూర్తు నతని॥

కం గారాబుఁ జెలియలవు నీ, కోరిక యొడఁగూర్తు సిగ్గు • గొనక కలతెరం
గేరుపడఁ దెలుపు మీ యన, నారాయణుఁ గని త్రపాలి • నమితానన యై॥ ౨౩

కం॥ తలవాంచి బొటనవ్రేలున, నిల వ్రాయుచుఁ గురులు కేల • నెగఁ ద్రోయుచు లే
మొలకనగవు కెమ్మోవిని, దులకింపఁగఁ గులుకుపలుకు • తో ని ట్లనియెన్॥ ౨౪

సుభద్ర కృష్ణుని నీవంటిభర్త కావలెనని యడుగుట.

ఆ॥ అన్న నాపయిన్ బ్రి • యంబున నీరీతి, నెలమి మెరయుపలుకు • పలికి వు
చెలియ లనుచు ముద్దు • సేసించి వాత్సల్య, మలరఁ గోరి ర్వ • వలయుఁ జుమ్ము॥

కం॥ రూపున గుణమున శౌర్యక,లాపరిణతి నెల్లతెరఁగు•లను నినుఁ బోలన్
జూపట్టెడు రాకొమరుని,నాపతిగాఁ యుం మీ జ•నార్దన కరుణన్॥ ౨౬

తే॥ ఎల్లతెరఁగుల నినుఁబోలు•వల్లభుండు, గలుగవలెనందుఁగడుఁ గోర్కి•గలదునాకు
నెలమి వీరంగ ముద్దునె•ల్లించి నాదు,తలఁపు చేకూర్ప మన్న వా•త్సల్యమలర॥

కం॥ అని వేఁడ మందహాసం,బునఁ దల పంకించి శౌరి • ముదితం గని యి
ట్లనియెన్ భవద లషితం,బొనరునె చేకూర్ప సద్గు•ణోత్తరయెపుడున్॥ ౨౮

కం॥ విను నాకు నేన సరి గా,కనయము ననుఁ బోల నుర్వి • నన్యుఁడు గలఁడే
వనజాక్షి నాకు సములును,ఘనులును లే రనెను శ్రుతిప్రి•కారము గాదే॥ ౨౯

కృష్ణుఁడు సుభద్రను మందలించుట.

కం॥ అనుజా వాత్సల్యంబున,గొనకొని నీకోర్కు లిత్తుఁ • గోరు మ టంటిన్
మును మించి నీదువాంఛిత,మనుకూలము గానిచంద • మై తోఁతెంచెన్॥ 30

ఆ॥ ఆఁడువారిబుద్ధు • లసురబుద్ధు ల టంచు,నాడువారిమాట • లన్నృత మగునె
నీటఁ జేఁపకాళ్లు • నెమక వచ్చును గాని,యింతిచిత్తవృత్తి • యెరుఁగ నగునె॥

కృష్ణుఁడు సుభద్రికు వరమిచ్చుట.

ఉ॥ వినను వత్సలత్వమున • నాడితిఁ గోరిక లిత్తు నంచు నె
న్నైనను నాఁ బ్రిసక్తవిష•యం బిపు సమకూర్ప రామి నో
మానిని వేరుజన్మమున • మామక మై తగునంశసంచితం
బౌనవతారమందు సతి•వై తగఁ బొందు మ ప్సితార్థమున్॥ 3౨

శా॥ సాక్షా న్మము గాక నష్టయిన నం•ర్చారూపమం దెన్నఁ బ్ర
త్యక్షుం డైనపుదంశమూర్తికిఁ ద్వదీ•యాంశాసమా వేశయు
క్త క్షేత్రింబు కళత్రి మయ్యెడు నయు•క్తం బొఁగదా యెందుఁ బ
ద్మాక్షి సోదరదంప •త్వాకలనం • బత ంతనింద్యంబుగన్॥ 33

ఉ॥ కోరఁగ రానికోర్కి యలి•కుంతల ధర్మ మెరుంగ నేరమిన్
గోరితి వన జన్మ మొన•గూడెడునప్పు వికారరూపమున్

గూరిన విగ్రహంబుల నె◆గున్ జుమి లోకవిరుద్ధనిందితా
చారకృతాపరాధమున ◆ జారుసె భోగ్యము గాక దోషముల్ ॥ ౩౮

చ॥ అది యటు లుండ నిప్పు డన◆జానన యెల్ల తెరంగులందు నా
కుఁ దులితుఁ డౌ ధనంజయుఁ డ◆కుంఠితశౌర్యపరాయణుండునున్
మదనసమాన రూపసువ◆మానసుఁడంచితుఁ డెల్లభంగులన్
మదవతి నీకునున్ దగిన◆నాథుఁడు వాని వరింపు మియ్యెడన్ ॥

చ॥ అని వర మిచ్చి కూర్మి నెర◆యన్ బ్రియసోదరి గారవించి ఫ
ల్గునకుఁ బత్నిగాఁగ నొడఁ◆గూరిచె నప్పుడు తద్వరాభియు
క్తి నిపుడు నీలశైలపతి◆కిన్ సతిగాఁగ సుభద్ర స్వాంశచే
నొనరెఁ బురాణగాథ గల◆దొక్కటి దీనికిఁ గారణంబుగన్ ॥ ౩౯

శివునకు బ్రహ్మహత్యకలుగుట.

॥ పూర్వకాలమున నం◆బుజగర్భునకు నహం,కారప్రధాన మై ◆ భూరిమహిమఁ
బంచమవక్త్రంబు ◆ ప్రభవించె నప్పుడు, బ్రహ్మణ్యులైనట్టి◆పరమమునులు
విశ్వాధినాథుఁ డౌ◆విభుఁ డెవ్వఁ డని యడు,గఁగ నేనయని యహం◆కారవక్త్ర
మున సముద్ధతిఁ బలి◆కిన మహాదేవుఁడు, ప్రస్ఫుటక్రోధభై◆రవమహోప

నీ॥ కారమునఁ దోఁచి నిజపాణి ◆ తలవిఱివాతి, మించి యైదవమోము ఖం◆డించినంత
హస్తమున నంటుకొనియె న◆మ్మస్తకంబు, తద్విమోచనమునకు నా◆తండు గడఁగి॥

కం॥ ప్రాయశ్చిత్తంబడఁగిన, ధీయుతు లగుమునివరులు ప◆తివ్రతచే భి
క్షాయుక్తిఁగనిన ముక్తం, బై యిది పోవు నని చెప్పి◆రం.కృతుఁడై॥

తే॥ అ లలోకకుటుంబిని ◆ యాదిలక్ష్మి హారికి ననపాయిని పతివ్ర◆తాద గాన
నామెచే భిక్షగొనిన నీ ◆ యఘముపాయు, ననుచు వైకుంఠమునకేగెనభవుడపుడు॥

విష్ణువు లక్ష్మిని శివునకు భిక్షయిడవద్దనుట.

తే॥ అతనియుద్దేశమెఱిఁగి ◆హరియుఁగమల, నిలయఁగనియిట్లుపల్కె మా◆నిహారుండు
బ్రహ్మహత్యావినిష్కృ ఁ ◆ బడయఁ గోరి వేగనిటవచ్చునీచేత ◆ భిక్షఁ గొనఁగ॥

తే॥ హస్తనిర్ముక్తయై బ్రహ్మ ◆ హత్యయిచటఁ, బడియె నేని మహాశక్తి ◆ ప్రతిభ దా
కడఁగియీలోకమెల్ల భ్రమిం◆గంగఁదివురుఁ, జెడుగుఁ గలిగించునని వేర◆ చెప్పనేల॥

తే॥ కాన నీ వాహరుండు భి, క్షకరు వేర నటుమటము చేసితొలఁగు మె ♦ గ్లైననింట
లేదనుచుఁ జెప్పమనుపని ♦ లేనిపనికి, బోవఁగా నేల యాపదఁ ♦ బొంద నేల॥

వ॥ అని యిట్లు వాసుదేవుం డుపదేశింపఁ గమలాలయయును దదుక్తమార్గం
బున నడచునది యైయుండె నప్పుడు శంకరుండును. ౮౩

మ॥ చని వైకుంఠము సొచ్చి భైరవుఁడు భిక్షాందేహి యం చాజనా
ర్దనుసౌధాంగణమున నిల్చి పలుకన్ ♦ దద్వాక్య మాలించి యా
వ్వనజాతాలయ యానతిన్ జెలులు దే ♦ వా! శ్రీఃకుతో వాఁగతా
యన శంభుఁ డిలు సేరెఁ గ్రిష్మరియధా ♦ యాతంబుగా నయ్యెడన్. ౮౪

తే॥ మరలిశాన్నాశకరుదెంచి ♦ మధు విరోధి, మందిరాంగణమునసనిల్చి ♦ మదనవైరి
ఘనరవమునభిక్షాందేహి♦యనఁగనునుప, టట్లుశ్రీయింట లేదని ♦ రామెచెలులు॥

కం॥ ఈరీతి మూఁడు నాలుగు సారులు సనుదెంచి యెపుడు ♦ సదనంబున నా
సారసగేహినిలేదను, ధోరణి నే పలుక వినుచు ♦ ధూర్జటి కినుకన్॥ ౮౫

శివుఁడు లక్ష్మిని శపించుట.

కం॥ కను తెరప్రఁజేసి లేదా, వనజాలయ యింటఁ జపల ♦ వర్తనయగుచున్
జనెనా మంచిది యట్లనె, చనుఁగాక యనన్నఁ జెలులు♦ సభయ లయి వెసన్॥

కం॥ చని యంతఃపురిభార్గవి, గని యాభైరవునికోప ♦ కలనం బెరిగిం
చిన సభయ యగుచు సరభస, మున భిక్షుఁగొనుచు వచ్చె♦ నుంగిటికివెసన్॥

తే॥ వచ్చియడుగులు దడఁబడ♦వందనంబు, సలిపి కడుభక్తి మెరయ భై ♦ క్షంబొసఁగి
ఈశ యపరాధమయ్యెక్ష♦మింపుమీఁడు, వా రెరుంగుదురే భవ ♦ త్ప్రాభవంబు॥

కం॥ అని వినత యగుచు వేఁడినఁ, దనయంతర్దృష్టి నామె ♦ తప్పన్యకృతం
బని యెఱిఁగి నెమ్మనంబునఁ గనికర మెంతయును గదురఁ ♦ గా నిట్లనియెన్॥

ఉ॥ ఇందిర నాయెడన్ గపట ♦ మి ట్లొనరించుట నీస్వభావ మా
చందము గాదు నీపతి యొ ♦ సంగిన యానతిచేసి తీవు నా
డెందము గంది తిట్టితి వ ♦ డిన్ విను నాతగుప ల్కుసత్యతన్
బొందునె నీకుఁ జాపలము ♦ భూస్థలి నెందు స్వభావధర్మ మా॥ ౯౦

ఉ॥ ఎత్తినకాలె గాని యొక ♦ యించుక నిల్కడలేక మాటలో
హత్తుట రిత్త యాటయును ♦ నై చరియింపుము చంచలత్వమే

వృత్తిగ నిట్లు గాక నొక ♦ వీరిడి యింటను గట్టిపెట్టి నీ
వెత్తరి నేనియుఁ గదల ♦ వసుధన్ విపరీతవైఖరిన్ ॥ ౫౮

॥ జగతి నీచాతినీచానుసరణకరణిఁ, జలనధర్మము నీయందె సంగతాత
నీవు గదిసినవిజ్ఞాననియతి సడలి, ప్రాజ్ఞుఁడైనను నజ్ఞతఁ ♦ బడయుఁ గాత॥

తే॥ ఇట్లు గమలాలయనుశపింపనామె, చెలులు హాహారవంబులు ♦ నేయు బెరిఁగి
పరగ విచ్చేసె నచటికిఁ జక్రధరుఁడు, శూలధరసాంత్వనక్రియాశాలి యగుచు॥ ౫౯

వ॥ అప్పుడు.

కం॥ పరమపతివ్రతలకు శే, ఖర మగువిశ్వజనయిత్రి ♦ కమలాలయ చే
గురుభిక్ష గొనుట హత్య, దురిత మడఁగ విధిశిరంబు ♦ దొలఁగెం జేతన్ ॥

బ్రహ్మహత్య శక్తి యగుట.

కం॥ నారకరనిర్ముక్తంబై, ధరణింబడి విధిశిరంబు ♦ దంచిత మాతృ
ద్భరమున నోరు దెరచి కడు, మెరమెరపడ భువనచయము ♦ మ్రింగందివిరెన్ ॥

కం॥ అపుడారభసము కనుఁగొని, శిపివిష్టుఁడు వెరవగాఁగ ♦ శేశయనాభుం
డుపగతుఁడై యడుగుటయు నర, మపుడిచ్చెదనుడుగు మిఁకగ్రసింపక జగముల్ ॥

తే॥ గడచె నష్టాదశమహాయుగంబులిట్లు, భైరవుని చేత నంటినప్పటియునుండి
ఘోరమైనట్టిక్షుధ నాకుఁ గూరెనిపుడు, దాని ర్వంగవలయును గానవినుఁడు॥

బహ్మహత్యాశక్తికి వరమిచ్చుట.

తే॥ అలజగములు నిలుచు మీయందె గాన, మిమ్మునిరువురనిటఁ బట్టి మ్రింగవలయు
నిదియె నాకోర్కి దీని మీరిచ్చిరేని, మేలు శాకున్న నేఁజేయఁ జాలుదునిది॥

మ॥ అనినన్ గేశవుఁ డిట్లు పల్కె భవదీయంబైనతుద్బాధ దీ
రనుపాయంబొడఁగూర్తు నోర్మి చెలువారన్ నీవు వింధ్యాద్రికిన్
జని యచ్చో నిలు వింధ్యవాసిని యనన్ ♦ సంప్రీతిఁ గొల్వం జనుల్
ఘనతన్ భక్తజనానుపాలనజిష్ణుత్వ యుక్తవై యంతటన్ ॥ ౬౫

కం॥ ఇరువదియెనిమిదియవద్వా, పరమున భూభారమడఁప ♦ బనివడి యేను
ర్వర నవతరించి పటుసం, గరము ఘటింపింతు ధరణికాంతులలోనన్ ॥ ౬౬

కం॥ పదునెనిమిదియుగములు గా, నొదవిన పెల్లాకలెల్ల ♦ నుడిగించుటకున్
బదునెనిమిదియక్షౌహిణు, లదయత బలియిత్తు నీకు ♦ నాహవభూమిన్ ॥ ౬౭

ఆ॥ అనుచు వర మొసంగి • యమ్మహాశక్తి ని, వింధ్యనగమునందు • విడిది సేయఁ
బనిచె నదియె ద్రుపదు•పట్టి యై హోమాగ్ని, కుండమున జనించెఁ•గూతురగుచు॥

కం॥ ఆపాంచాలతనూభవ, భూపాలవరులకుఁ బాండు•పుత్రులకుఁ గులో
ద్దీపకులకు సతి యగుచు మ, హాపాతివ్రత్యవిభవ • యై విలసిల్లెన్ ॥ ౭౫

వ॥ ఇట్లుండ నంత.

భారతయుద్ధప్రశంస

మ॥ ధృతరాష్ట్రాత్మజుఁ డౌనుయోధనుఁడు కుం•తీపుత్రులన్ ద్యూతసం
గతినోడించి ధరాతలం బఖిలమున్ • గైకొన్న ధర్మానువ
ర్తత నోర్మిన్ విపినాధివాస మట పై • నజ్ఞాతవాసం బొన
ర్చి తగన్ బిమ్మట నర్ధరాజ్యమున కం•ర్థిన్ గోర్కు గాలించినన్ ౭౬

చ॥ ఘనతరలోభదూషితుఁడు • కౌరవనాథుఁడు సంధిమార్గమున్
మొనయక వాఁడిసూదిమొన • మోపినమాత్రము భూమి వారి
కనుఁగొను వారు వీరును మ•హారణకాంక్ష నుపక్రమించి పై
కొని రిలఁ గల్గుభూపతులు • గూడిరి యయ్యిరువాఁగులందునన్ ॥ ౭౭

తే॥ అవని బహుభారపీడిత • యగుచు వేఁడ, భూమిభారావతరణార్థ•ముగ జనించి
నట్టివసుదేవసూతి యం•దర్జునునకుఁ బూనె రథచోదకత్వ ము • ప్పుడు గడంగి॥

ఆ॥ ఆపదలు దీర్చి సంపద • లందఁ జేయఁ, దాన యేడుగడంచుఁ జి•త్తమున నమ్మి
యున్న పాండుతనూజుల • నుగ్రగరణము, నందుఁ బడకుండఁ గాపాడ•నవధరించి॥

కం॥ పదునెనిమిదియక్షోహిణు, లుదితక్షుధ దీర శక్తి • కొసఁగుటకొరకున్
గదనక్షోణి నిజాప్తులఁ, బ్రిదికింపఁ దలంచి శౌరి • పనివడి యంతన్ ॥ ౮౧

కం॥ ఒకనాఁడు రహస్యంబున, బకవైరిన్ బిలిచి యుచిత•వచనరచన మ
చ్చికఁ ముచ్చటాడి వసుదే, వకుమారుండటుఁ బ్రిసంగ•వశమున ననియెన్ ॥ ౮౨

భీమునకు కృష్ణుఁడుపాయము సెప్పుట.

ఉ॥ విం వె వాయుపుత్ర యొక•వింత భవత్ప్రతిజ్ఞ సేని తాఁ
దొంటిభవంబునం దఖిల•దుష్టవిదారిణి యైనశక్తి సు
మ్మంటినతుత్తునన్ జగము • లన్నియు గ్రమింగఁ గడంగి మాన్పని
ప్పుంటికిఁ బుట్టె నియఖిల•భారత సైన్యములన్ గ్రసింపఁ గన్ ॥ ౮౩

కం॥ మొదటి పారిహారులపరమున, నుదితత్రూధ లప్పు డాఁచి • యుండి ధర్త్రిక్
బదునెనిమిది యక్షౌహిణు, లదయత గ్రసియింప నిప్పు • డవనిజనించెక్ ॥ ౭౮

కం॥ వినుమా శక్తి గ్రసింపఁగఁ, గొను నక్షౌహిణుల మీరు • కూడ సునికి నే
ననిశము మిము రక్షింపఁగ, మనమున వెర వరయు చుందు • మారుతతనయా॥

ఉ॥ నీ వొక రాతిరిం గపట•నిద్రవహించి పరీక్ష సేయుమా
దేవి నిశీధవేళఁ బర•తెంచి భయంకరశక్తిసంఘ సం
సేవిత యై శ్మశానమునఁ • జిందులు ద్రొక్కుచు నుండు నప్డు నీ
వావిధ మెల్లఁ జూచి భయ•మంద కెరుంగనియట్లు శ్రిమ్మరక్ ॥ ౭౯

కం॥ చనుదెంచి కేళిమందిర, మున నుండును శక్తి సౌమ్య•ముగ ద్రౌపది యై
చనుదెంచునపుడు బలమున, మనోజకేళిఁ దనియింపు • మా యవ్వేళఁదక్ ॥ ౮౦

కం॥ నప్పుడు సర్వలోకని, దానం బగునాదుశక్తి • తథ్యముగా నీ
లోనక్ జొనుపుదు నపరిమి, తానందము నొందుఁ దృప్త • యై శక్తి కడుక్ ॥

కం॥ సంతృప్త యైనశక్తి యుం, సంతోషముతోడ వర మొ•సఁగుదు నడుగు నీ
యంతర్వాంఛిత మను నీ, వంతట మాయేవ్వురకును • నభయం బనుమీ॥

కం॥ ఇది నీచేఁ గావలసిన, యది వదను ల కసాధ్య•ముగుఁ గావున నీ
మదిఁ గొంకు లేక సాధిం, పఁ దగు మదుక్తవిధమెల్ల • భావించి యనక్ ॥ ౮౨

కం॥ మురవైరివాక్యపద్ధతిఁ, గరువ సుతుఁ డొక్కనాఁడు • కైతవనిద్రా
పరుఁడై తనసతిచర్యలు, పరీక్ష యొనరించి చూచె • భయ మెదఁగొనకే॥ ౮౧

వ॥ అప్పుడు. ౮౨

ముదు శక్తి కృత్యములుచూచుట.

మ॥ కనియెక్ వాయుసుతుం డనేకవిధకం•కా స్ఫుర ఛ్ఛకర
ధ్వనిక్ప్రద్భూరిక పాలకుండలరటా•త్కారామిళద్భీషని
స్వననృత్యద్భహులోగ్రశక్తి పరిష•త్సంసేవ మానక్ లల
ద్ఘనదంష్ట్రాంకురదుర్నిరీక్ష్యభయదా•కారోత్కలాడంబరక్ । ౮౩

కం॥ భైరవు లెనమండ్రు మహో, గ్రారవభేతాళ • మునవధిభయదా
కారోగ్రశక్తి లోకము, చేరి యుపాసింపఁ బ్రభుతఁ • జెంది వసించెక్ ౮౪

# జగన్నాధీయము

మ॥ అపు డాశక్తి సమూహముల్ భరతసైన్యప్రాగ్ర్యరోధావ
క్షపణ్ర డనుఁ బాళ్లు పంచికొనుచున్ • గాలించుకోలాహలం
బపరిజ్ఞేయభయావహం బగుడు దేహాంబెల్లఁ గంపింపఁగా
విపులత్రాసభరంబునన్ మగిడి యుద్వేగంబుతోడన్ జనెన్॥ ౯౫

కం॥ పదములు తడఁబడఁ గడువడి, సదనమునకు వచ్చి ఘోర • సందర్శనస
వ్యధ మై చిత్తము చెదరఁగఁ, బదపడి యొకభంగి శయ్య • పై వసియించెన్॥

ఉ॥ అప్పుడు సామరూపధర • యై వనజానన కృష్ణశయ్యపై
కొప్పుగ వచ్చినంత వనజోదరువాక్యము సంస్మరించి తా
నప్పవమానసూతి కుసుమాయుధసంగరసంప్రవిష్టుఁ డై
యుప్పువుబోఁడి తృప్త యగున ట్లొనరించె బలంబు పెంపునన్॥ ౯౬

ఆ॥ సకలలోకభార • సహ మైనతన తేజ, మనిలతనయునందుఁ • జొనిపెఁ గృష్ణ
యధిక తేజుఁ డగుచు • న వ్వాయుజుఁడు మహా, శక్తి తృప్తి నొంద • సలిపె రతము॥

కం॥ మరుకేళి తృప్తి నొందెనఁ, బరవశ యై సుఖనిలీన • భావ యగుచు నే
వర మిత్తు నడుగు మనుచున్, బరమోత్సాహమునఁ బలికెఁ • బావనితోడన్॥

ద్రౌపది భీమునకు వరమిచ్చుట.

కం॥ వరమిత్తువేని మాయే, వురి నీసంగరమునందుఁ • బోరి వుచ్చక నీ
వరయుము గృప నభయంబిడి, సర రుహ నేత్రి సుప్రసన్నాశయ వై॥ ౯౦

కం॥ అని వరముఁ వేఁడికొనన, వ్వనజానన వల్లెయని యెఁ • బదపడి ప్రకృతిన్
గని తనపోరపాటునకును, మనమున విభ్రాంత యగుచు • మానిని యంతన్॥

చ॥ కరువలిపట్టి సూచి యనెఁ • గారణ మేమిటు వునన్ను నీ
వరమడుగంగ ఖేద మగు • వైఖరి దోఁచెడు నేఁడు నీయెడన్
సరసిజనాభుయోచన పాసంగెను నేఁ డెరిగింపునిక్క మీ
వరపరలాడితేని కుల • మారడివోవ శపింతు నియెడన్॥ ౯౧

చ॥ అన భయ మంది వాయుసుతుఁ • డంగనతో ననె నేఁడు దేవ
తనయుఁడు నాకు దగువిధం బలంబు నెరుంగఁ దెల్పి యీ

యనిఁ బడ కుండ సోదరుల • నైదుగురిన్ బ్రదికింపు మంచు నిన్
జనకున వేఁడు మంచు నను శాసన మిట్లొనరించె నావుడున్ ॥ ౯౩

ద్రౌపది కృష్ణుని శపించుట.

చ॥ కను లెద నిండ మాధవునిఁ • గన్గొని సోదరి యంచు వాని నీ
మనమున నెంచుకేని యను•మానము నొందక నీదు తేజమున్
జొనిపితి వెంతయున్ బవన•సూనునిలోఁ గపటంపు నైజమై
తనరెడు నిట్టి నీదు చరి•తం బుచితంబె సురాసురాంతకా॥ ౯౪

కం॥ చేసిన కర్మఫలంబులు, బోసేయక తీరునే ప్ర•భున కైనను నీ
వీ సేఁత భవాంతరవి, న్యాసతఁ దెలియలికి మగఁడ • వై యుందు మిఁకన్ ॥

ఉ॥ వారక నాయెడన్ గపట•వర్తనఁ బూనితి గాన దీన నీ
వారయ దిక్కు లేక గహ•నాంతరమందుఁ గిరాత బాణపా
తోరుతరోపఘాతమున • నొంది జుగుప్సిత మైనతీరునన్
ఘోర ప్రఁజావు చావుమని • కోపము మీరఁగఁ దిట్టె నాతనిన్ ॥ ౯౫

కం॥ ఈ దేహోస్థియుతంబుగ, నాదట మూర్త్యంతరంబు • నంది సుభద్రన్
సోదరి నిజపత్నిగఁ దా, మోదర గ్రహియింపు మనుచు • ముదిత శపించెన్ ॥

చ॥ అది విని కృష్ణుఁ డిట్లనియె • నక్కట నీవిపు డేమి త్రవ్వితీ
పొద లెడుతిట్టు తిట్టి పువు•బోఁడిరో కాఁ గలకార మిట్టి దై
యొదవె సుభద్ర కోరె నిది • యుగ్మలి కే వర మిచ్చితిన్ జగ
ద్విదితము మచ్చరిత్రము ప•విత్రము సంశయ మొంద నేటికిన్ ॥ ౯౬

కం॥ పురుషుండ నేను ప్రకృతియె, పరికింపఁగ స్త్రీస్వరూప•ప్రకృతిపురుషయో
గరహస్యము సుమి విశ్వ, ప్రరోహ కారణము శ్రుతిశి•రః కథితం బౌ॥ ౯౭

౦ సెలఁతరో విను మేను • నిర్గుణుం డను నిరం, జనుఁడ నస్సంగుండ•సాక్షి మాత్రుఁ
డను నాదుసాన్నిధ్య•మున జడప్రకృతిబ్బం, హణ మొంది యీ విశ్వ• మై వెలుంగు
నరయుమ యతేఁజోను ప్రవేశంబు, చేఁ జిదాభాసుండు • జీవుఁ డగును
నఖిలభూతసముండ • నగుట నా కెపుడను, జ్ఞాపరిహారముల్ • సంభ ంప

॥ ఇట్లు గావున భ్రాతృపు•త్రాదిభావ, మెల్ల నీ దేహసంబంధ • మింతె గాక
యాత్మ భేద మెసఁగునే • యంబుజాక్షి, యిది యెఱుంగమిఁ బలికితి•విట్లు వు॥

వ॥ అని ద్రౌపది వాక్యంబులు గీటునం బుచ్చి యా భక్తవత్సలుం డాత్మీయ భక్తప్రాణరక్షణంబువలనం బరితుష్టుం డయ్యెఁ దదనంతరంబున.

॥ భారతయుద్ధంబు ♦ ప్రాప్తమయె ను బదు, నెనిమి దక్షౌహిణులు ♦ లానవారి
వీరిబలంబులు ♦ విక్రమోర్వులు , భీష్మద్రోణకర్ణులుశల్యుఁడును గ్రో
మముగ సైన్యేశులై ♦ యమరి యష్టాదశ, దినములు కలన వర్తించి రందు
మార్జునులు సముద్ధామబాహుశక్తి, మెరసి మర్దించి రమిత్రసేన

గీ॥ మిగులు బలమునశ్వత్థామ ♦ దెగి వధించె, కడకు నుభయ సైన్యంబులు ♦ గలనఁ గూలె
పాండవులుగృష్ణసాత్యకు ♦ ల్బదికిరిందుఁ గృపుఁడుఁ గృతవర్మ ద్రౌణిమి ♦ గిలిరియందు

తే॥ కాలచోదితమైయదు ♦ గణము దెగిప, రస్పరనిరూఢసంప్రహా ♦ రములసమసె
నటువి నేకాంతముగనుయో ♦ గాప్తి నున్న, వ్యాధుడొకడమ్ముచే గృష్ణు ♦ హత్తు
నిజేసె ॥

తే॥ ద్రౌపదీశాపవిధ మ ♦ దధ్యమయ్యె, నవల ఫల్గునుఁడేతెంచి ♦ వారియవస్థ
గాంచి శోకించి యపుడు సం ♦ స్కారమిచ్చె, పొంగి జలరాశి ముంచి గ్రామం ♦
పోయెఁ దనువు॥

జగన్నాథావతారము.

కం॥ కడలిఁ బడి కృష్ణదేహము, వడిదరఁగలఁ గొట్టికొనుచు ♦ వచ్చి కలియుగం
బడరినయెడ బూర్వాంబుధిఁ బడివచ్చెన్ నీలశైల ♦ ప్రాంతంబునకున్ ॥

కం॥ ఇంద్రద్యుమ్ను నియానతి, నింద్రుని శిల్పి చనుదెంచి ♦ హితమతితోని
స్తంద్రదార్వి విగ్రహములు పేంద్రుని రచియించునప్పు ♦ డీశునియాజ్ఞన్ ॥

కం॥ జీవననిధిఁ దోఁచినకృష్ణుని, తనుసంధులు దెచ్చి గూఢ ♦ తమముగనందున్
జొనిపి హరివి గ్రహంబులు, పొనరించి యొసంగెనపుడు ♦ భూమీశునకున్ ॥౧౦౭

సుభద్రను జగన్నాథునకు భార్యగా జేయుట.

తే॥ ఆసుభద్రకు హరియిచ్చినట్టివరము, ద్రౌప శాపమునుఫల ♦ రూపమొంది
యాజగన్నాథునకును భార్యయయితోచె, నాసుభద్ర మహామును ♦ లారవినుఁడి॥

॥ ఇది జగన్నాథునకు బ ♦ య్యెసుభద్ర, పొసగుటకుగల్గినట్టి ♦ పూర్వగాథ
యధికగోప్యము నివ్వ ♦ త్తాంతమెల్ల, దెలిపితిని మీకునివ్వేళ ♦ దెల్లముగను ॥

# జగన్నాథీయము

వ. అనియిట్లు సూతుండు సుభద్రాకళత్రకారణం బెరింగించిన విని ప్రహృష్టచిత్తులయి మును లతనికిట్లనిరి. ౧౧౦

తే॥ పరఁగు కృపావతారానుభావ ఘనుచు, నీజగన్నాథుఁ జెప్పెద వితఁడు బుద్ధ
దేవునవతార మనుచు నుతింతు రార్యు,లవ్విధం బేమి? సందేహ మపనయింపు॥

వ॥ అని యడిగిన సూతుం డి ట్లనియె.

## బౌద్ధావతారము.

॥ అవని యధర్మోపహత మై జనంబులు, క్షుద్రదైవతపూజఁ జొచ్చి జంతు
హత్యలు బలులును నాసురవిధిఁ జేయుచును తమోనిరతులై వనరుచునికి
జనులను సత్యవిశ్రాంతులఁ జేయఁగా, హరిబుద్ధరూపుఁడై యవతరించె
కపిలవస్తునగరాధిపతిశుద్ధోధనుం, డనుభూమిపతికి మాయాఖ్యసతికి

గీ॥ నద్భుతావహజన్ముఁడై యఖిలసురలు, వినుతి సేయఁ గ్రమంబున వృద్ధినొందు
నధికవైరాగ్యమునఁ బ్రభోధాతిశయము, గాంచి బుద్ధుఁడనం గవిఖ్యాతినొందె॥

అఖిలభూతంబులందు దయానిరూఢి, యమరఁగల నైన హాని సేయక పరోప
కారశీలత నంచితాచారనిష్ఠ, మెలఁగి మనుజుండు ముక్తుఁడై వెలయు ననుచు

గీ॥ ఆత్మసిద్ధాంతపద్ధతి ననుసరించి, జనులనందరఁ ద్రిప్పి దుస్తంత్రఘోర
మతములజయించి యాత్మీయమతము నిల్పి, జగములకు మేలొనర్చె నాచక్రధరుఁడు

ఆ॥ అట్లు బుద్ధుఁడైన హరి తదీయావతా,రాంతమున స్వయమైన యంశ
కలియుగమున నాజగన్నాథమూర్తి యం, దచ్చుపడఁగ నిలిపి యరి గెవికి॥

ఆ॥ సర్వజనులు మోక్షసామ్రాజ్య మొందంగ, సములు భ్రాతృభావసహితులగుచు
నొకరి కొకరు చాల నుపకారశీలురై, మనఁగ వలయు సాధుమార్గనియతి॥

కం॥ అనుసూక్తి బౌద్ధమతమున, కనయంబును ముఖ్యధర్మ మగుటను జను లె
ల్లనువర్ణధర్మభేదము, లెనయక మనుమనుట బుద్ధు నీప్సిత మగుటన్ ॥ ౧౧౧

తే॥ ఆజగన్నాథునందు బుద్ధాంశ గలిమి, దత్ప్రసాదము వర్ణభేదంబు లేక
రమణఁ గైకొందు రెల్ల వర్ణములవార, నియమమందు నేటికి నెసఁగుచుండు॥

తే॥ వర్ణభేదంబుదలఁచి యెవ్వార లచటఁ, దత్ప్రసాదము గ్రహింపఁ దడయువారు
వార లాచంద్రతారకనారకప్ర, యాతనల నొందువారు సత మిది వినుఁడి॥

# జగన్నాథీయము

ఉ॥ ఎండిన గుల్లినన్ జెడిన • నేకట నొందినఁ గంటి కింపుగా
నుండినఁ దత్ప్రసాదము శు•భోన్నతి సేయుఁ బరిగ్రహింప మా
ధుం డెవఁడేని దానిని గ•దున్ వెగటొంది గ్రహింప కుండునా
తం డిహామున్ బరంబు సెడి • దైన్యము నొందుఁ గృతాపరాధుఁ డై॥ ౧౨౧

శా॥ నీలాద్రీశునియందు నాసుగతుఁ డు•న్మీలత్ప్రభావాఢ్యుఁ డై
పోలన్ నిల్చుట బౌద్ధధర్మముల ను•ద్బోధంబు తత్త్రైత్రిమం
దోలిం గల్గెడువర్ణధర్మనియమం • బొక్కింత పాటింప కే
వేళన్ సర్వసమత్వలక్షణము భా•వింపంగ నౌ నచ్చటన్॥ ౧౨౨

వ॥ ఇది జగన్నాథునందు బౌద్ధావతారసంప్రవేశంబు గలదనుట కుపలక్షణంబు గావున నీలాద్రీశునిబౌద్ధావతారయుక్తునిఁగా నెఱుంగునదియని చెప్పిన బ్రహర్ష సమేతులై శౌనకాదు లారోమహర్షణి నభినందించి హరికథాశ్రవణవిధానకృతార్థంమన్యమానమానసు లై రని చెప్పటయును.

॥ శాలివాహనశక•సంవత్సరంబునఁ, బదియా నెన్మిదినూర్ల•పైనముప్ప
దారగువర్తమా • నానందవత్సర, వైశాఖపూర్ణిమా • వసరమునందు
నవ్వాడాలినివాసుఁ • డగుశ్రీ జగన్నాథు, సమధికశుభరథో • త్సవమునందు
నడవిపాంబశివస • మాహ్వయుండును నంద, గిరివేంకటస్వాఖ్య • బరగుమేము

॥ కలిసి శివవేంకటాఖ్య స•త్కవులనంగ, శ్రీవడాలి జగన్నాథ•దేవునెదుట
హితమతినిజగన్నాథీయ•కృతిరచించి,యొసగితిమిశాశ్వతస్ఫూర్తి•యొసగునట్లు॥

॥ పరమహంసయుఁబరి • వ్రాజకాచార్యుండు, పురుషోత్తమానంద • పూర్వ్యకావ
ధూత యీదేవునిం • దుఁ బ్రతిష్ఠగావించి గ్రామంబు నగ్రహా • రముగ దెచ్చి
తాఁగొన్నిదినములు • దృఢభక్తిఁబూజించి తనవెన్కఁ గ్రాసుపా • లనము భూమి
పతులకు స్వాధీన • పరచి తా నేగె నవ్వల రాజ ధూర్వహు • లల యతీంద్రు

॥ కట్టడలనెల్ల పాలించి • గడపుచుండి, రంత నాంగ్లేయపాలకు • లరసి దీని
పాలనమ్ము స్వదేశ భూ • పతులచేతి, కిచ్చు టవసరమగునని• యెంచి యపుడు॥

॥ గురజ జమీన్ దారి • గోల్పోయియున్న శ్రీరాజాదిబిరుద వి • భ్రాజితుండు
కఘదన పాపయా • ఖ్యాతుఁడౌ గతజమీన్ దారున కిచ్చిరీ • ధర్మకర్తృ

తనుదద్విభునియనం◆తరము దత్పుత్రుండుఁ, దద్భ్రాతృ పుత్రు లు◆త్తమవిధమున
బాలించి రవ్వల ◆ నోలి దేవస్థానపాలన సభ్యుల ◆ పరముఁ జేసి

గీ॥ రాసభికులకు ప్రతినిధి ◆ యగుచు దీని, నిర్వహించెను పిన్నమ ◆ నేనియచ్చ
యాఖ్యుఁడవ్వలప్రతినిధియయ్యెఁగొల్లి, శీతయాఖ్యుండు వినయ వి◆ఖ్యాతియుతుడు॥

॥ కొల్లి - తయసమా◆ ఖ్యుఁడువడాలి క్షేత్రి, జగదీశ్వరప్రతి◆ష్ఠాప్రకార
బోధకంబగుజగ ◆ న్నాథీయకృతినిశ్రీ, స్వామిసన్నిధినివి ◆ ద్వద్వరేణ
యుతసభఁజదివిశ్రీ ◆ యుతప్రబంధకవి పం, చాననబిరుదస ◆ మన్వితముగు
సౌవర్ణభూషఁబ ◆ త్సంసద్విబుధులస, మక్షమందొసఁగెఁద ◆ దనుమతమున

గీ॥ మాకుశివవేంకటాహ్వయ ◆ మహితులకును, శ్రీజగన్నాథుకరుణావి ◆ శేషమునను
బ్రిధితమగుచునాచంద్రతా ◆ రకముగాను, దీయకృతితల్లజంబువ ◆ ర్ధిల్లఁగాత॥

ఆశ్వాసాంత్యము.

శా॥ ఉద్యద్భానుసహస్ర సన్నిభ విభా ◆ వ్యాధోల్లసత్కౌస్తుభ
ప్రోద్యద్భూరి భుజాంతర స్థగితభూ ◆ పుత్రీకుచద్వంద్వభా
కృద్యోతలిప్త మృగీమదాంక విసర ◆ త్స్వైరభవ్య విభ్రాజితా
ఖ్యద్యోతాన్వయ వార్ధిచంద్ర త్రిజగ ◆ త్కల్యాణ సంధాయకా॥ ౧౨౮

పుష్పగుచ్ఛబంధము.

చ॥ పరమరమారసజ్ఞపద ◆ పద్మపతత్సురనార ధీరతా
కరవర నీరదాభ కన ◆ కప్రకటాంబర సారగీర సో
త్తరవరసారద ప్రతత ◆ తక్షత మానిజనాజవంజవా
చిరతర శూరతాఢ్యశివ ◆ శిష్టశివంకర భూరమారతా॥ ౧౨౯

కం॥ అథ్రిధునీజనకపదన, దభ్రిదయారస నిదాన ◆ దరహీర లస
చ్ఛుభ్రాంశు నిర్మల యశో, విభ్రాజిత సూర్యపురప ◆ విత్ర నివాసా॥ ౧౩౦

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీకరసమస్తసుగు ◆ ణాకర జగత్త్రితయ ◆ సేవితపదాంబుజ వి ◆ లాసా
నాకసద స్తుత స ◆ మంచితచరిత్రనమ ◆ దభ్యుదయకారణ వి ◆ కాసా

—27

# జగన్నాథీయము

ప్రాకటదయావిభవ ♦ పాలితసుధీనికర ♦ భక్తజనదుష్కృత ని ♦ రాసా
లోకచయరక్షణ వి ♦ లోల శశిభాస్కర వి ♦ లోకయుతమంగళ మ ♦ హాశ్రీ॥

గద్య.

ఇది శ్రీమద్వృషాకపికృపాకటాక్ష పరివర్ధితసహజ సారస్వతసమ్పాది
తప్రబంధ కవిపంచానన బిరుదాభిరామ విశ్వామిత్ర బ్రహ్మర్షి
సంప్రదాయాడవి నందగిరి వంశాబ్ధిసోమ సహజసాహ్వా
దమహోద్యమ సాంబశివ వేంకటప్ప రాయ
కవిలలామ వినిర్మితంబగు శివవేంకటీయ
గ్రంథమాల యందు ద్వితీయ
పుష్ప మగు జగన్నా
థీయమహాప్రబంధ
మునః సర్వం
బును
చతుర్థాశ్వాసమును
సమాప్తము.

శ్రీ





# శుద్ధపత్రిక.

:o:

## కవిజీవితము.



| పారట. | పద్యసంఖ్య. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| I. | | ౨ | సంస్పృష్ట | సంస్పృష్ట |
| | | ౩ | ద్వి యము | ద్వితయము |
| | | ౧౩ | జిన్నఁదన | జిన్నతన |
| | | ౧౮ | శైళవాల | శైవాల |
| II | | ౪ | చిన్నఁదనంబు | చిన్నతనంబు |
| III. | | ౮ | చిన్నఁ | చిన్న |
| | | ౧౦ | దనము | తనము |
| IV. | | ౩ | యణోద్భుణాత్తర | యణాద్భుతోత్తర |
| | | ౪ | కాంధ్రీకరణమగు | కాంధ్రీకరణము |

## గ్రంథము.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౧ | ౧ | కాంక | గాంక |
| ౨ | ౪ | ౩ | ద్యోగము | ద్యోతము |
| | ౫ | ౨ | నాలుగిటన్ | నాలుగిఁటన్ |
| ౩ | ౧౧ | ౪ | మురవన్ | మురహిన్ |
| ౫ | ౧౭ | ౨ | నాంశవి | నాంశవ |
| ౬ | ౩౪ | ౨ | నసివాయు | నశివాయు |
| ౭ | ౪౧ | ౧ | రాముఁము | రాముఁడు |
| ౮ | ౪౪ | ౧ | సోదృత్వ | సోద త్వ |

| | | | | |
|---|---|---|---|---|
| ౧౦ | ౫౫ | ౨ | కారించుకయిక్ | గారించుకయుక్ |
| ౧౨ | ... | ౫ | గాళరమ్మైళరమైన | శాళరమైళరమైణ |
| | ... | ౭ | దీళరత్న | దేళరత్న |
| | | ౧౮ | జఘృతా | జేఘృతా |
| | | ౧౭ | సివో | జే సెబో |
| | | ౨౨ | చలనంబుక్ | కలనంబుక్ |
| | | ౨౬ | లలితానం | లవితానం |
| | | ౨౭ | బరిషు | బరిఘు |
| ౧౪ | ... | ౧౭ | కీవణ | వణ |
| ౧౫ | ... | ౬ | ఖ్యా(.స | ఖ్యా(గేశ |
| | | ౧౪ | స్థలముల | స్థలములు |
| | | ౧౭ | హాత్ప్రకలిత | హాత్వకలిత |
| | | ౨౪ | నొక | నొకట |
| ౧౬ | ౧౧౪ | ౨ | డోనిక్ | డోగిక్ |
| | ౧౧౮ | ౨ | నిట్టులవతుగ | నిట్టులడుగ |
| ౧౮ | ... | ౩ | నవికస్థల | నలికస్థల |
| | | ౮ | మదధికా | మదధిశా |
| | | ౧౩ | మేర్వడంగ | మేర్వడగ |
| ౧౭ | ... | ౪ | నక్త్రైడై | నక్త్రండై |
| | | ౧౬ | దరిదము | ద్రరము |
| ౧౯ | ౧౩౫ | ౩ | రే | రేఖ |
| | ౧౩౬ | ౨ | నుపనయాదుల | నుపనయసాదుల |
| | ౧౩౯ | ౩ | బోనిక్ | బోగిక్ |
| ౨౦ | ... | ౨ | డనుటయు | డగుటయు |
| | ... | ౪ | శా వు | వాదీవు |
| | ... | ౨౮ | వ్వరిని యరిని | వ్వరిగియరిగి |
| ౨౨ | ౧౫౯ | ౫ | కర ర | కరవీర |
| | | ౬ | పరివాత | పరివృత |

| | | | | |
|---|---|---|---|---|
| | | ౮ | సమలంకవిష్ణ | సమలంకరిష్ణ |
| | | ౭ | రోరలీకృత | రోరరీకృత |
| | ౧౬౦ | ౪ | త్వాక్షీకాం | త్యాయకాం |
| | ౧౬౧ | ౨ | పరినీత | పరిణీత |
| ౨౪ | ౬ | ౧ | ముగిలి | మిగిలి |
| | | ౨ | యిక్క్యయక్ | యిక్క్యయనక్ |
| ౨౫ | ౧౮ | ౩ | మానారాగ | మానరాగ |
| ౨౬ | ౨౪ | ౧ | దూరనట్టు | దూరనట్టి |
| ౨౮ | ౩౦ | ౩ | కిత | వత |
| | | ౪ | కేయింపు | జేయింపు |
| ౨౭ | ౪౨ | ౨ | జలధి | బలభి |
| | ౪౩ | ౧ | శాయి | శాయ |
| ౨౯ | ౪౮ | ౪ | నీయాజ్ఞ | నీయాజ్ఞ |
| ౩౦ | ౫౦ | ౨ | తిదిసుత | దితిసుత |
| | ౫౧ | ౧ | శా విష్ణ | శ్యావిష్ట |
| ౩౧ | ౬౨ | ౨ | వినతం | వివతుం |
| | ౬౪ | ౩ | ల్చి | దాల్చి |
| ౩౩ | ౮౯ | ౪ | దెచిం | దెంచి |
| ౩౪ | ౭౪ | ౩ | సుట్టినో | సుట్టునో |
| ౩౫ | ౯౧ | ౧ | ప్రాక్శ్యల | ప్రాక్శైల |
| | ౯౬ | ౩ | వెల్లుల | వెల్గుల |
| | ౯౭ | ౫ | ప్రవాహాంబు | ప్రభావంబు |
| | ౯౯ | ౨ | నల్లడ | నల్గడ |
| ౩౮ | ౧౧౪ | ౧ | లోల | లోన |
| ౩౯ | ౧౨౫ | ౧ | తుండుక్ | తుండక్ |
| ౪౨ | ౧౪౩ | ౧ | మహా | మహీ |
| | ౧౪౯ | ౩ | తలం | దలం |
| | ౧౫౦ | ౨ | మీషుశై | మీషువై |

| | | | | |
|---|---|---|---|---|
| ౪౫ | ౧౬౬ | ౧ | ధర్మశ్య | ధర్మస్య |
| ౪౭ | ౧౭౭ | ౪ | పరిశస్త్రో | పరిశస్త్రా |
| | | ౬ | లినీలాం | వినీలాం |
| | | ౩ | నపోప్డ | నపోప్రిడ |
| ౪౯ | | ౫ | బల్పేశలై | బల్పేపవై |
| | | ౧౦ | గోడపై | గోరపై |
| | | ౧౧ | వేబులిక్ | వేబువిక్ |
| | | ౧౭ | నిట్టి | గిట్టి |
| | | ౨౬ | వాసాంజవి | వాపాంజలి |
| | | ... | కృతవ్వర్గ | కృత్వ్వర్గ |
| | | ౨౮ | వాండమా | హిండమా |
| ౫౦ | ౧౭౭ | ౩ | న్నిరాచారిరాచారులక్ | న్నిరాబారిరాబారులక్ |
| | | ౪ | భారిత్రు | భారిత్ర |
| | | ౧౦ | నయాం | న్యాయం |
| | | ౧౧ | చ్ఛలిక్ | చ్ఛవిక్ |
| | | ౧౬ | ముస్తోక | మస్తోక |
| | | ౧౮ | వెల్లు | వెల్గు |
| | | | మూర్ధ్న | మూర్ధ |
| ౫౧ | ౧౯౬ | ౨ | చిన్మయి | చిన్మయ |
| ౫౩ | ౨ | ౧ | నారాయణశర్మ | నిందప్రిద్యుమ్నుండు |
| | ౩ | ౧ | అరిగెంకృత | అరిగెంకృత |
| | ౬ | ౩ | పూర్వవారి | పూర్వవార్ధి |
| | ౮ | ౧ | వేధ | వేద |
| | | ,, | వ్యర్థత | వృద్ధత |
| ౫౪ | ౯ | ౩ | జూపంగదా | జూపుంగదా |
| | ౧౦ | ౨ | బడి | బడ |
| | ౧౩ | ౧ | రాకర | లాకర |
| | | ౨ | బట్టి | పట్టి |

| | | | | |
|---|---|---|---|---|
| ౭౪ | ౧౫౯ | ౫ | లిచ్ఛక్తి | చిచ్ఛక్తి |
| ౭౫ | ౧౬౬ | ౪ | నటు | నటి |
| ౭౬ | ౧౬౯ | ౧ | గాంచన | కాంచన |
| | ౧౭౩ | ౧ | సవల్లో | పవల్లో |
| ౭౭ | ౧౭౮ | ౧ | సహ్యాజ | సహ్యాజా |
| ౭౮ | ౧౮౫ | ౩ | నిలిప్త | నివిష్ట |
| ౭౯ | ౧౯౧ | ౫ | వర్థ | నర్ష |
| ౮౦ | ౧౯౪ | ౧ | ద్రైజగ | ద్రైయాజగ |
| | ౧౯౬ | ౩ | వీచో | వీచో |
| | | ౪ | స్వీకా | స్వేకా |
| | ౧౯౭ | ౨ | పల్లు | సల్లు |
| | ౧౯౮ | ౧ | మురా | ముదా |
| | ౧౯౯ | ౩ | చనల | చలన |
| ౮౨ | ౨౧౫ | ౨ | హాలి | హావి |
| | ౨౧౬ | ౧ | తనమల | ములను |
| ౮౫ | ౬ | ౨ | లిఖాన్న | వియాన్న |
| ౮౬ | ౧౦ | ౪ | తవితీపు | తరితీపు |
| | ౧౬ | ౨ | గబ్బరోయి | గుబ్బదోయి |
| ౮౭ | ౨౩ | ౨ | త్రిపాలి | త్రిపావి |
| ౮౮ | ౨౮ | ౨ | కూర్ప | కూర్ప |
| | ౩౨ | ౨ | విపుడీ | విపుడె |
| ౯౦ | ౪౫ | ౧ | కొన్నాళ | కొన్నాళ్ల |
| ౯౩ | ౭౪ | ౧ | లప్పు | యాపుడు |
| | ౭౮ | ౧ | నప్పుడు | నప్పుడు |
| | ౮౧ | ౨ | గొనకే | గొనకే |
| ౯౪ | ౮౫ | ౨ | గాలించు | గావించు |
| | ౯౨ | ౩ | సంగెను | సంగెనో |
| ౯౫ | ౯౪ | ౧ | కనులెద | కనలెవ |